# కలివికోడి జాతి పునరుద్ధరణ ప్రణాళిక



నవంబర్ - 2013







ఆంధ్రప్రదేశ్ అటవిశాఖ ద్వారా కేంద్ర పర్యావరణ
మరియు అటవిశాఖ, భారత ప్రభుత్వం వారికి సమర్పించబడినది







# కలివికోడి జాతి
# పునరుద్ధరణ ప్రణాళిక

ఆంధ్రప్రదేశ్ అటవిశాఖ ద్వారా
కేంద్ర పర్యావరణ మరియు అటవిశాఖ,
భారత ప్రభుత్వం వారికి సమర్పించబడినది

నవంబర్ - 2013





## కార్యనిర్వాహక సారాంశము

జెర్డన్స్ కోర్సర్ రినాప్టిలస్ రాత్రివేళ సంచరించే పక్షి ఇది భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మాత్రమే కనిపిస్తుంది. ఇది ప్రపంచంలోనే అఋదుగా కనిపించే పక్షి రకం మరియు ఇది ఇంటర్నేషనల్ యూనియన్ ఫర్ కన్జర్వేషన్ ఆఫ్ నేచర్ (ఐయుసిఎన్) చేత ఇది తీవ్రమైన ప్రమాదంలో (క్రిటికల్లీ ఎన్‌డేంజరడ్ – సిఆర్) ఉన్నట్లుగా వర్గీకరించబడినది. 1986 లో భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ , కడప జిల్లా రెడ్డిపల్లి గ్రామము వద్ద ఈ రకం తిరిగి ఆవిష్కరించబడనంత వరకు అంతరించిపోతున్నట్లుగా విశ్వసించబడినది. తిరిగి ఆవిష్కరించబడిన స్థలమును శ్రీ లంకమలేశ్వర అభయారణ్యముగా 2000 వరకు జెర్డన్స్ కోర్సర్ పై పరిశోధనకు అప్పగించబడినది మరియు దాని యొక్క ఉనికి బాంబే నేచురల్ హిస్ట్రీ సొసైటీ (బిఎన్‌హెచ్ఎస్) రాయల్ సొసైటీ ఫర్ ది ప్రొటెక్షన్ ఆఫ్ బర్డ్స్ (ఆర్ఎస్‌పిబి) మరియు డార్విన్ ఇనిషియేటివ్ మరియు ఆంధ్రప్రదేశ్ అటవీశాఖ (ఎపిఎఫ్‌డి) చేత సహకరించబడిన యూనివర్సిటీ ఆఫ్ రీడింగ్ మరియు కేంబ్రిడ్జ్ తో కలిసి నిర్వహించబడినది. ఈ యొక్క ప్రమాణికమైన సర్వే టెక్నిక్ అభివృద్ధిలో వాటి యొక్క ఉనికిని గుర్తించిన ఒక ప్రగతి ఏర్పడినది మరియు వాటి యొక్క సహజ స్థితిని కావలసిన అవసరాలను వర్ణించబడినది. అయినప్పటికి ఈ రకములపైన ఒక ఆధారితంగా ఉండే సమాచారమును పొందుటకు గాను ఇంకా చాలా టెలిమెట్రి అధ్యాయనముల ద్వారా పరిశోధన వలన వాటి ని జీవన మనుగడకు కావలసిన ప్రత్యేక సామర్థ్యమును తెలుసుకొనుటకు నిర్వహించవలసిన అవసరం ఉన్నదని స్పష్టమవుతుంది. అంతేకాకుండా అదనంగా ఈ జాతి మనుగడ అభివృద్ధిలోని సుస్థిరత మరియు నిర్వహణ విధానములను అవలంభించుటలో చాలా వరకు ఒత్తిడి కలిగి వున్నది. జెర్డన్స్ కోర్సర్ పై సరైన అవగాహన లోపం వలన మరియు ఆ జాతి యొక్క మనుగడపై ఒత్తిడి పెరుగుతున్నందు వలన వాటాదారులు వాటి పునరుద్ధరణ ప్రణాళిక (ఎస్ఆర్‌పి) తయారుచేసుకొనుట జరిగినది. ఈ ప్రణాళిక యొక్క ముఖ్య ప్రయోజనం ఏమనగా ఈ జెర్డన్స్ కోర్సర్ జాతి మనుగడ చాలా కాలము వరకు భద్రపరచుట. ఈ ప్రణాళిక ఒక బహుముఖ ప్రయోజనాలు కలిగివున్న విధానము అనగా ఇందులో పరిశోధన ముఖ్యాంశములు , నిర్వహణ, అనుకూలవాదన, విద్య పరిరక్షణ, మనుగడ నిర్వహణ మరియు శిక్షణ మరియు నిధులు అందించుట మొదలగునవి ఉంటాయి. క్రమంగా పర్యవేక్షణకు మరియు విలువకట్టి అంచనావేయుటలో సౌకర్యము అందించుటలో ఒక సమయపాలనను ఏర్పాటుచేసుకొనుట మరియు బాధ్యతలను గుర్తించుట అవసరములను ఇది స్పష్టంగా తెలియజేస్తున్నది. ఈ డాక్యుమెంట్ ఎప్పుడైతే ఈ జాతి యొక్క స్థితిగతులకు సంభవించగల పరిణామాలకు మరియు జాతుల పంపిణీ నియంత్రించబడునపుడు ముందు జాగ్రత్త చర్యలను తీసుకొనుటలో చాలా వరకు ప్రధానమైన శ్రద్ధను కలిగివుంటుంది. ఈ ఎస్ఆర్‌పి చాలా మొత్తంలో వాటాదారులు ప్రభుత్వం, ఎన్ జి ఓ లు, జాతీయ మరియు అంతర్జాతీయ శాస్త్రవేత్తలు మరియు సివిల్ సొసైటీలు కలిసి ఏర్పాటుచేయబడినది. అందువలన ఇది ఒక అన్ని కలిసివున్న మరియు వాస్తవికమైన డాక్యుమెంట్. ఈ ఎస్ ఆర్ పి కన్సర్వేషన్ మేనేజర్లకు, పాలసీ మేకర్స్, పరిశోధకులకు, నిర్ణేతలకు మరియు భవిష్యత్తు చర్యల నిమిత్తం తీసుకొనుటకు ఆధారంగా ఒక సూచన గా పనిచేస్తుంది.





## ఉపోద్ఘాతం:

జెర్డన్స్ కోర్సర్, రినోప్టిలస్ బైటర్క్వేటస్ రాత్రివేళ మేల్కొనివుండు పక్షి మరియు ప్రపంచంలో భారతదేశంలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో మాత్రమే కనిపిస్తుంది. 1900 సంవత్సరము తరువాత 1986 లో (భూషన్ 1986) భారతదేశంలో ఆంధ్రప్రదేశ్ లోని కడప జిల్లా రెడ్డిపల్లి గ్రామములో తిరిగి ఆవిష్కరించబడినంత వరకు మునుపెన్నడూ జెర్డన్స్ కోర్సర్ యొక్క ఉనికి అంతరించిపోవుటను గుర్తించబడలేదు. ఇందుకు గాను తిరిగి ఆవిష్కరించబడిన స్థలమును శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము పేరుతో ఏర్పాటుచేయబడినది. 2000 సం॥లో ఈ పక్షి పంపిణీ ఒకే ఒక స్థలం ఇది కొన్ని వందల మీటర్ల వ్యాసార్థంలో పొదలు కలిగివున్న అడవి రెడ్డిపల్లి, సగిలేరు లోయలో ఉన్నది. 2000 సంవత్సరము నుండి ఇచ్చట జెర్డన్స్ కోర్సర్ పై పరిశోధనకు అప్పగించబడినది మరియు దాని యొక్క ఉనికి బాంబే నేచురల్ హిస్టరీ సొసైటీ (బిఎన్హెచ్ఎస్) రాయల్ సొసైటీ ఫర్ ది ప్రొటెక్షన్ ఆఫ్ బర్డ్స్ (ఆర్ఎస్పిబి) మరియు డార్విన్ ఇనిషియేటివ్ మరియు ఆంధ్రప్రదేశ్ అటవిశాఖ (ఎపిఎఫ్డి) చేత సహకరించబడిన యూనివర్సిటీ ఆఫ్ రీడింగ్ మరియు కేంబ్రిడ్జ్ తో కలిసి నిర్వహించబడుచున్నది. ఈ యొక్క ప్రమాణికమైన సర్వే టెక్నిక్ అభివృద్ధిలో వాటి యొక్క ఉనికిని గుర్తించిన ఒక ప్రగతి ఏర్పడినది మరియు వాటి యొక్క సహజ స్థితిని కావలసిన అవసరాలను వర్ణించబడినది. ఈ క్రింద ఇవ్వబడిన విధానముల ద్వారా ఎక్కడైతే జెర్డన్స్ కోర్సర్ గుర్తించబడిన దో అక్కడ మూడు కొత్త స్థలములను శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము పరిసర ప్రాంతములలో (జగన్నాథన్ ఇటిఎఎల్ 2004ఎ) గుర్తించబడినవి.



జెర్డన్స్ కోర్సర్ అధ్యాయనములో ట్రాకింగ్ స్ట్రిప్‌లను వినియోగించుకొని గుర్తించబడిన ఇష్టమైన మనుగడలను ఒక పొదలు కలిగివున్న అడవి బయలు ప్రదేశములు ఎక్కడైతే పొదల యొక్క సాంద్రత (2 మీటర్లు కంటే తక్కువ పొడవు) మరియు శ్రేణి 300–700 హెక్టారులుగా ఉండి మరియు చిన్న పొదల సాంద్రత (2 మీటర్ల కంటే ఎక్కువ పొడవు, 1000/ హెచ్ఎ (జగన్నాథన్ ఇటి ఎ ఎల్ 2004 ఎ) గుర్తించబడినది. తొమ్మిది రకాల ప్రత్యేక ముప్పులు గుర్తించబడినవి ఈ జాతుల యొక్క మనుగడకు ప్రధాన అపాయము ఈ యొక్క పొదలు కలిగివుండే అడవి తగ్గిపోవుట మరియు నష్టపోవుటయే ( జగన్నాథన్ 2006, సేనాపతి ఇటి ఎ ఎల్ 2007).

ఇదివరకు తెలిసిన జనాభా మరియు జెర్డన్స్ కోర్సర్ శ్రేణి చాలా తక్కువగా వున్నందున మరియు తరిగిపోతున్నందున దీనిని తీవ్రమైన ప్రమాదస్థితిలో ఉన్నట్లుగా క్యాటగిరి క్రింద ఐ యు సి ఎన్ రెడ్ లిస్టులో ( ఐయుసిఎన్ 2008) చేత గుర్తించబడినది. ఈ జాతి యొక్క పంపిణి, జీవావరణ శాస్త్రం, జనాభా పరిమాణము మరియు మనుగడ అవసరాల గురించి చాలా తక్కువ సమాచారము కలిగివున్నది. (బర్డ్‌లైఫ్ ఇంటర్నేషనల్, 2001 ).

ఈ యొక్క డాక్యుమెంట్‌లో మొదటగా జెర్డన్స్ కోర్సర్ గూర్చిన సాంప్రదాయ జాతి పునరుద్ధరణ ప్రణాళిక బాంబే నేచురల్ హిస్టరీ సొసైటీ వివిధ సంస్థలు మరియు వ్యక్తులతో చర్చలు జరిపిన పిమ్మట తయారు చేయబడినది. అనుబంధం 1, జెర్డన్స్ కోర్సర్ గురించి తీవ్రమైన ప్రమాద స్థితిపై హైదరాబాద్ నందు తేది. 29–30 జూన్, 2008 మరియు మే 5, 2010 నాడు నిర్వహించిన ఈ యొక్క జాతి పునరుద్ధరణ ప్రణాళిక సదస్సులో పాల్గొనినవారితోచర్చలు జరిపిన తరువాత తయారుచేయబడినది. ఈ ప్రణాళిక ఈ జాతి యొక్క మనుగడ వచ్చే 10 సంవత్సరముల వరకు అనగా 2010–11 నుండి 2020–21) దీర్ఘకాలము వరకు సుస్థిరం చేయుటకుగాను తీసుకొనవలసిన, పోషించవలసిన పాత్ర, బాధ్యతలు మరియు తీసుకోవలసిన చర్యలను గుర్తించినది. ఈ చర్యలు నిమిత్తం చాలా ఏజెన్సీల ప్రమేయం కలిగివున్నవి మరియు ఈ ప్రణాళిక ఆంధ్రప్రదేశ్ అటవీ శాఖతో మమేకమైన పనిచేయవలసిన అవసరం ఉన్నది. ఇవన్ని జెర్డన్స్ కోర్సర్ మనుగడ నిర్వహణలోని ప్రధానమైన బాధ్యతలు కలిగివుంటాయి.



## జాతి యొక్క వర్ణన:

ఈ జెర్డన్స్ కోర్సర్ అను జాతి మొత్తంగా భారతదేశంలో వున్న రినోప్టిలస్ జన్యువులను కలిగివుంటుంది మరియు ఇది సహజంగా మన భూబాగానికి వ్యతిరేక దిశలో వున్న ఆఫ్రికాలో వుండే రాత్రివేళ తిరిగే అలవాటును కలిగివున్నది. ఇది చాలా పెద్ద కన్నులు, ఒక మొనదేలి వున్న పసుపు పచ్చ రంగు ముక్కు మరియు పసుపుపచ్చ రంగు కాళ్ళను కలిగివుంటుంది. ఈకల లక్షణములతో బ్రౌన్ రంగు చాతిలో రెండు సన్నని తెలుపు బ్యాండ్‌లు, వెడల్పు తెలుపు లోర్స్‌లను మరియు చుట్టూ చాలా నల్లటి చెంప మార్కులను కలిగివుంటుంది. (గ్రిమెల్ట్ ఇటి ఎ ఎల్ 1998, రాస్ముసేన్ అండ్ యాండర్టన్, 2005).

## వర్గీకరణము :

జెర్డన్స్ కోర్సర్ కొరాడ్రిఫార్మెస్ క్రమమునకు చెందినది. ఇది గ్లేరియోలిడీ కుటుంబమునకు చెందినది అంతేకాకుండా ఇది ఉప కుటుంబం కర్సోరియినేగా వర్గీకరించబడినది. (మ్యాక్లీన్ 1996). ఈ యొక్క ఉప కుటుంబం కర్సోరియినేలో రెండు రకాల ప్రత్యేకతలు కలిగివున్న పక్షులు ఉన్నాయి అవి జీనస్ ప్లూవియానస్ మరియు నిజ కోర్సర్‌లు. మూడు విధాల జీన్స్‌లలో అనగా కర్సోరియస్, స్మట్‌సోర్నిస్ మరియు రినోప్టిలస్ ప్రపంచవ్యాప్తంగా ఎనిమిది రకాల నిజమైన కోర్సర్ జాతులున్నాయి. భారత దేశంలో రెండు జాతుల కర్సోరియస్ లు ఉన్నాయి , క్రీము రంగు గల కోర్సర్ కర్సోరియస్, కర్సర్ మరియు ఇండియన్ కోర్సర్ సి. కోరమాండలికస్ మరియు ఒకే ఒక్క రినోప్టిలస్ కోర్సర్ , జెర్డన్స్ కోర్సర్ రినోప్టిలస్ బైటర్క్వేటస్ (రస్ముసేన్ మరియు యాండర్టన్ 2005). జెర్డన్స్ కోర్సర్ ఈ యొక్క రినోప్టిలస్ జీనస్ మూడు జాతులలో ఒకటి మరియు మిగతా రెండు జాతులు ఆఫ్రికాలో ఉన్నాయి. (త్రి బ్యాండెడ్ కోర్సర్, రినోప్టిలస్ సింక్టస్ మరియు బ్రాంజ్ వింగ్డ్ కోర్సర్ ఆర్. చాల్కోప్టరస్ (మ్యాక్లిన్, 1996).












### ప్రస్తుత పరిరక్షణ పరిస్థితి మరియు సంబందిత చట్టం :

జెర్డన్స్ కోర్సర్ ఆంధ్రప్రదేశ్‌లో స్థానికమైనది. చారిత్రక రికార్డుల ప్రకారము ( 19 వ శతాబ్దంలో ) ఆంధ్రప్రదేశ్ గానే మరియు పొరుగు రాష్ట్రమైన మహరాష్ట్ర గా తెలుపబడినది. ఇటీవల 20 మరియు 21 వ శతాబ్దములలో రికార్డులన్నియు ఆంధ్రప్రదేశ్ గానే చేయబడినవి. ఈ జాతి ఐయుసి ఎన్ రెడ్ లిస్టు (ఐయుసిఎన్ 2010) లో తీవ్రమైన ప్రమాదం కలిగివున్న జాతి గా చేయబడినది. ఇది ఐ యు సి ఎన్ లోని తీవ్రమైన ప్రమాదం పొంచివున్న క్యాటగిరిలలో అత్యంత స్థానంలో వున్నది మరియు నాశనానికి చాలా దగ్గరలో వున్న జాతిగా వున్నది. జెర్డన్స్ కోర్సర్ ఇండియన్ వైల్డ్‌లైఫ్ ప్రొటెక్షన్ యాక్టు , 1972 లోని షెడ్యూల్ 1 క్రింద పట్టికలో చేరబడినది మరియు ప్రభుత్వ నేషనల్ వైల్డ్‌లైఫ్ యాక్షన్ ప్లాన్ (2002-2016) (భారత ప్రభుత్వం, 2002) క్రింద అత్యంత ముందు ప్రధాన్యత జాతిగా పరిగణించబడినది. ఇది భారత ప్రభుత్వం చేత వైల్డ్ లైఫ్ హ్యాబిటెట్ ప్రొగ్రాం (11వ పంచవర్ష ప్రణాళిక, భారత ప్రభుత్వ) విలీనమైన అభివృద్ధి కార్యక్రమములో చేర్చబడినది. ఈ జాతి బెదిరింపులకు గురైన జాతిగాను జీవ వైవిధ్య చట్టం, 2002, సెక్షన్ 38 ప్రకారము గుర్తించుటకు గాను ప్రతిపాదించబడినది.

# చారిత్రక మరియు ప్రస్తుత పంపిణి

## జెర్డన్స్ కోర్సర్ ( 1848-1900 ) యొక్క చారిత్రక పంపిణి.

జెర్డన్స్ కోర్సర్ మొట్ట మొదట శాస్త్రీయంగా టి.సి జెర్డన్ సి. 1848, తూర్పుకనుమలపైన వున్న కొండలు కలిగివున్న ప్రాంతములోని నెల్లూరు మరియు కడప జిల్లాల నుండి, (బ్లీత్ 1848) చేత రికార్డు చేయబడినది. 1867 మే నెలలో డబ్లు.టి. బ్లాన్‌ఫోర్డ్ ఈ యొక్క పక్షిని గోదావరి పై సిరోంక (ఇది తూర్పు మహరాష్ట్ర ప్రాంతము) దగ్గర చూసినారు. ఆ తరువాత 1871 మార్చిలో అతడు భద్రాచలంలో చూసినారు (బ్లాన్‌ఫోర్డ్, 1898). 1990లో హొవార్డ్ క్యాంప్‌బెల్ జెర్డన్స్ కోర్సర్‌ను ఆంధ్రప్రదేశ్‌లోని అనంతపూర్‌లో చూసినారు ( బేకర్ 1929). చిత్రపటం 1లో ఈ యొక్క చారిత్రక రికార్డుల పంపిణి తెలుపుతుంది. దాదాపు 86 సంవత్సరముల వరకు జనవరిలో భూషన్ చేత 1986 వరకు ఆంధ్రప్రదేశ్‌లోని కడప జిల్లా, రెడ్డిపల్లి వద్ద తిరిగి ఆవిష్కరించునంత వరకు జెర్డన్స్ కోర్సర్ కనిపించనే లేదు.




## ఇటీవల రికార్డులు (1986-2008)

ఎప్పుడైతే జెర్డన్స్ కోర్సర్ తిరిగి ఆవిష్కరించబడినప్పటి నుండి నిర్ధారించబడిన రికార్డులు కొన్ని స్థలముల నుండి మాత్రమే ఉన్నాయి మరియు అవన్నియు శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము ఆంధ్రప్రదేశ్ కడప జిల్లా పరిసర ప్రాంతములోనే ఉన్నాయి. తిరిగి ఆవిష్కరణ తరువాత వెంటనే ఒక సర్వే ప్రధానంగా, దక్షిణ ఆంధ్రప్రదేశ్ అనగా కడప, నెల్లూరు, చిత్తూరు మరియు అనంతపూర్ జిల్లాలలో నిర్వహించబడినది ( భూషన్ 1994). ఈ సర్వే సమయంలో జెర్డన్స్ కోర్సర్ పై చేసిన నిర్ధారణచేసిన రికార్డులు ఆరు ప్రాంతముల నుండి తీసుకోబడినవి మరియు ఇందులో ఆరు ప్రదేశములలో రెండింటిలో కనిపించినది. ఈ సైట్ రికార్డులు ఒక్క కడప జిల్లా నుండి మాత్రమే రికార్డు చేయబడినవి. నిర్ధారణ చేయబడని జెర్డన్స్ కోర్సర్ రికార్డులు 14 స్థలముల నుండి చేయబడినవి. (చిత్రపటం 2). ఎక్కడైతే గమనించబడిన స్థలములలో కనిపించిన స్థలములు మినహా ఇతర ప్రదేశముల నుండి రికార్డులు అవి నిర్ధారణ చేయబడినవి మరియు నిర్ధారణ కానివి 1994 మే నెల, నుండి 1995 అక్టోబర్ నెల వరకు దక్షిణ ఆంధ్రప్రదేశ్ లో నిర్వహించబడిన సర్వేలో స్థానిక షెడ్యూల్డ్ తెగల ప్రజలు లేదా పక్షులను వే టగాళ్ళు వారి నుండి నివేదికలను తీసుకోబడినవి. (సామంత్ మరియు ఎలాంగోవన్, 1997) కాని ప్రధానంగా శ్రీ లంకమలేశ్వర అభయారణ్యములోనే మరియు దాని పరిసర ప్రాంతముల నుండి తీసుకోబడినది. వారు ఇంకా కొన్ని సైట్ రికార్డులను గమనించినారు అవి ప్రధానంగా తిరిగి ఆవిష్కరించబడిన సైట్ లోనే మరియు పరిసర ప్రాంతము నుండి మాత్రమే తీసుకోబడినవి. ఆంధ్రప్రదేశ్ ఉత్తర భాగములో జెర్డన్స్ కోర్సర్ రికార్డులు 19వ శతాబ్దం నుండి కనిపించలేదు.




Figure 2 shows Jerdon's Courser records from 1986-2000. Map based on Bhushan 1994

2000 సంవత్సరమునకు పూర్వం జెర్డన్స్ కోర్సర్ యొక్క రికార్డులు ప్రధానంగా రాత్రి సమయంలో నడుస్తున్నపుడు కనిపించిన వాటి నుండి చేయబడినవి. 2000 సంవత్సరములో ఒక కొత్త విధానము జెర్డన్స్ కోర్సర్ ను ఉనికిని తెలుసుకొనుటకు ట్రాకింగ్ స్ట్రిప్స్ పైన పక్షులు వారి యొక్క ప్రత్యేక పాదముద్రలు మెరుగుపరుస్తూ అభివృద్ధిచేయబడినది. ఈ ప్రాంతములోని ఇతర పక్షి జాతులతో పోల్చితే అవి వేరుగా ఉంటాయి. ఇవి ఆటోమేటిక్ కెమరాలను ఏర్పాటుచేసినప్పుడు పక్షుల ట్రిగర్ చేసినపుడు ఫ్రేమ్ యొక్క కిరణ ఆటంకము ఏర్పడి నిటారుగా భూమిని చేరుకొంటాయి. ఇది పక్షుల గుర్తింపును ఒక ప్రత్యేక ట్రాక్‌లో ఏర్పరచినట్లుగా గుర్తించుటకు అవ కాశం కలిగిస్తుంది. (జగన్నాథన్, ఇటిఎఎల్ 2002). ఈ విధానమును వినియోగించుకొనే సర్వేలలో మూడు కొత్త స్థలములలో జాతులను గుర్తించినవి (జగన్నాథన్, 2006). అయినప్పటికి వీటిలో ఒక స్థలములోని ఉనికి ఆ తరువాత తెలుగు గంగ కాలువ నిర్మాణ సమయంలో నాశనం చేయబడనది.

జెర్డన్స్ కోర్సర్ యొక్క అరుపు 2002 , సెప్టెంబర్ లో గుర్తించబడి మరియు రికార్డు చేయబడినది. దీనికి ముందు ఎవరికి తెలియదు. (జగన్నాథన్ మరియు వోట్టన్ 2004). ఈ జాతుల గుర్తింపును వ్యక్తిగతంగా అరుపును విని దానిని రికార్డు చేయబడినది మరియు అరుపును టేపులో రికార్డు చేయబడినది. జెర్డన్స్ కోర్సర్ అరుపుల టేపు ప్లే చేయు ప్రయత్నములను తగు విధమైన ముందుగా తెలిసిన స్థలములో 1 కిలో మీటరు లోపు సాయంత్రం వేళ (సూర్యాస్తమయం తరువాత 45-90 నిమిషములకు) జెర్డన్స్ కోర్సర్ ను తొమ్మిది కొత్త ప్రదేశముల నుండి ప్రతిస్పందనలను తీసుకోవడం జరిగినది. అదనంగా ఒక టేపు ట్రాన్ సెక్ట్ సర్వే విధానము ఈ జెర్డన్స్ కోర్సర్‌ను ఒక కొత్త ప్రాంతములో కనుగొనుటకు గాను ఒక సాధనం చేయబడినది. ఈ క్రింద ఇవ్వబడిన విధానము, సర్వేలు తెలిసిన ప్రాంతము అభయారణ్యము బయట లోపల మరియు పరిసర ప్రాంతములో తగువిధమైన మనుగడ సామర్థ్యం గల ప్రాంతములో నిర్వహించబడినవి. టేపు ప్లేబ్యాక్ 403 పాయింట్ల వద్ద చేయడం జరిగింది. ఈ పాయింట్లు ఒక్క సారి సర్వే చేయబడినవి మరియు జెర్డన్స్ కోర్సర్ మూడు పాయింట్ల వద్ద ప్రతిస్పందించినది. ఈ అన్ని ప్రదేశములు ఒరిజినల్‌గా తిరిగి ఆవిష్కరించబడిన స్థలము రెడ్డిపల్లి వద్ద 14 కిలోమీటర్ల లోపే ఉన్నాయి. (జగన్నాథన్ 2006). 2000 సంవత్సరము నుండి జెర్డన్స్ కోర్సర్ అన్ని రికార్డులు అనగా చూసిన రికార్డులు, కెమెరా ట్రాప్ కాప్చర్స్, పాదముద్రలు మరియు అరుపులు చిత్రపటం 3లో చూపించబడినవి.




Figure 3 shows the current distribution of the Jerdon's Courser

## క్లిష్టమైన నివాసం

జెర్డన్స్ కోర్సర్ ప్రధానంగా అడవి పొదల చెట్లలో నివశిస్తుందని నివేదించబడినది. ఇది కొద్ది కొద్దిగా వున్న పొదలు, పొదలు కలిగివున్న అడవులు అక్కడ క్కడ వున్న ఖాళీ స్థలములు మరియు మృదువుగా ఎత్తుపల్లాలలో, రాళ్ళతో కూడిన కొండలలో నివశిస్తుంది. శ్రీ లంకమనేశ్వర అభయారణ్యములోను మరియు దాని పరిసర ప్రాంతములోను నిర్వహించబడిన ఇటీవలి అధ్యాయము వలన జెర్డన్ కోర్సర్ ఒక ప్రత్యేకమైన పొదలను కలిగివున్న అడవి ప్రాంతములో నివశించుటకు ఇష్టపడుతుందని తెలియవచ్చినది. ఇవి చాలా వరకు వినియోగించుకొని గుర్తించబడిన ఇష్టమైన మనుగడలను, ఒక పొదలు కలిగివున్న అడవి బయలు ప్రదేశములు ఎక్కడైతే పొదల యొక్క సాంద్రత ( 2 మీటర్లు కంటే తక్కువ పొడవు ) మరియు శ్రేణి 300–700 హెచ్ఎ గా ఉండి మరియు చిన్న పొదల సాంద్రత (2 మీటర్ల కంటే ఎక్కువ పొడవు, 1000/ హెచ్ఎ (జగన్నాథన్ ఇటిఎల్ 2004 ఎ) గుర్తించబడినది. జెర్డన్స్ కోర్సర్లు ఎక్కడైతే చెట్లతో కూడిన ప్రదేశములను ఇష్టపడతాయి అనగా అవి హార్డ్‌వికియా బినాట, ఇవి పరిపక్వతకు వచ్చిన పొదలు వీటికి పెద్ద మొత్తంలో ఆటంకములు ఏర్పడవు అనగా చాలా కాలము వరకు స్పష్టంగా ఉంటాయి (జగన్నాథన్ ఇటిఎల్, 2004). 2000 సంవత్సరములో శ్రీ లంకమలేశ్వర అభయారణ్యములోపల మరియు దగ్గర గల పొదల సాంద్రత కలిగి వున్న అడవి యొక్క మ్యాప్ మరియు జెర్డన్ కోర్సర్ అనువుగా వున్న భాగములను చిత్రపటం 4లో చూపించబడినవి. పొదలు కలిగివున్న అడవిని పంట పొలాలుగా, పచ్చిక బయళ్ళు మరియు ఇతర భూములుగా మార్పిడి చేయుట జరుగుతున్నందున (సేనాపతి ఇటిఎల్ 2007) మ్యాప్ చూపించిన దాని కంటే పొదలు కలిగివున్న అడవి విస్తీర్ణం తక్కువగా ఉంటుంది.



## జీవావరణ శాస్త్రం

జెర్డన్స్ కోర్సర్ యొక్క ప్రవర్తన గురించి ఇది వరకు చాలా తక్కువగా తెలిసినది (బర్డ్ లైఫ్ ఇంటర్నేషనల్, 2001). జెర్డన్స్ కోర్సర్ రెట్ట రెండు శ్యాంపిల్‌లలో శరీర భాగముల యొక్క మ్యాక్రొటర్మ్స్ చెదలు మరియు చీమలే కలిగివున్నాయి (జగన్నాథన్ ఇటిఎఎల్ 2004 బి). జెర్డన్స్ కోర్సర్ యొక్క బ్రీడింగ్ జీవావరణ శాస్త్రం గూర్చి ఏమి తెలియదు (బర్డ్స్ వైల్డ్ లైఫ్ ఇంటర్నేషనల్, 2001) ఎలాంటి గూళ్ళు లేదా పక్షి పిల్లల రికార్డులు లేవు. అయినప్పటికి, పెద్ద జెర్డన్స్ కోర్సర్ వెంట చిన్న పిల్లల పాదముద్రలు మాత్రం నేల పైన కనిపెట్టబడినవి తద్వార అధ్యాయన ప్రాంతములో విజయవంతమైన బ్రీడింగ్ ఏర్పడినట్లు సూచిస్తున్నది. (జగన్నాథన్ ఇటిఎఎల్ 2004 బి).

## ప్రస్తుత బెదిరింపులు :

పంట పొలముల కోసం మరియు మొక్కలను పెంచుటకు గాను మరియు ప్రాజెక్టులను అభివృద్ధిచేయుటకు గాను సంరక్షణ ప్రాంతములోపల మరియు పరిసర ప్రాంతములో పొదలు కలిగివున్న అడవులను తొలగించివేయుట జెర్డన్స్ కోర్సర్ మనుగడకు ప్రస్తుత బెదిరింపు గొడ్డలిపెట్టుగా తెలియవస్తున్నది. కొంత వరకు ఇతరములు కూడా పక్షులు ట్రాప్ చేయుట అని తెలియవస్తున్నది. నేల సర్వేలు మరియు రిమోటు తో గుర్తించు అధ్యాయనములు రెండు కూడాను పొదలు కలిగివున్న అడవులు చాలా ఎక్కువ మొత్తంలో శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము సరిహద్దు ప్రాంతములో ఇటీవలి కాలములో జెర్డన్స్ కోర్సర్ యొక్క రికార్డులు వున్న ప్రాంతములతో సహా అడవులను తొలగించివేయుట వలన నష్టము జరుగుతున్నట్లుగా తెలియవచ్చినది. (జగన్నాథన్ 2006, సేనాపతి ఇటి ఎ ఎల్ 2007). అభయారణ్యము బయట ఇటీవల జరిగిన పొదలు కలిగివున్న అడవులను తొలగింపు, పచ్చిక బయళ్లను జంతువుల మేపుట కొరకు సృష్టించబడినది. మెట్ట పొలము పంటలను పండించుట కొరకు, విదేశీయ మొక్కలను మరియు నిమ్మ తోటలు, క్వారీలు, మరియు తెలుగుగంగ కాలువ నిర్మాణములను చేయుటకు తొలగించవేయబడినది. శ్రీ లంకమలేశ్వర అభయారణ్యములోపల అభివృద్ధి కార్యకలాపాలు అనగా చెక్ డ్యామ్‌ల నిర్మాణము, కందుకములు మరియు అభయారణ్యము దగ్గర చాలా పెద్ద మొత్తంలో ఆవాసకేంద్రములు పెరుగుట వలన అక్రమంగా బర్డ్ ట్రాపింగ్ పెరుగుటకు దారితీసింది. అయినప్పటికి ఈ కార్యక్రమము న్యాయబద్దంగా లేనందున రహస్యంగా నిర్వహించబడినది మరియు తెలియరాలేదు. పొదలు కలిగివున్న అడవులను మేపుట వలన మరియు శ్రీ లంకమలేశ్వర వైల్డ్‌లైఫ్ అభయారణ్యము పరిధిలోపల కలప కోసం చెట్లను నరుకుట జరిగినది.




ప్రత్యేకంగా సరిహద్దు వద్ద నరికివేయటం జరిగినది. ఇటీవల తక్కువ స్థాయిలో, ఇది కొంత వరకు జెర్డన్స్ కోర్సర్‌లకు పొదలు సాంద్రత నిర్వహించుట వలన అవి వాటిని ఇష్టపడతాయి కావున వాటికి కొంత వరకు మేలు జరిగినది. అయినప్పటికి అభయారణ్యము దగ్గర మానవుల ఆవాస కేంద్రముల సంఖ్య పెరుగుట చేత పొదలు కలిగివున్న అడవులను మేపుటకు అవకాశం కలిగి మరియు చెట్లను నరుకుట కూడా చాలా పెరిగిపోయినది మరియు  అడవి పొదల సాంద్రతను జెర్డన్స్ కోర్సర్ కు అనుకూలంగా ఉండుట కంటే తక్కువ స్థాయికి తగ్గించివేయబడినది. అయినప్పటికి శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము చుట్టుప్రక్కల తెలుగుగంగ కాలువ నిర్మాణము స్థానిక ప్రజలకు అడ్డగోడ కాగలదు మరియు పొదలు కలిగివున్న అడవిని చేరుకొనుటకు మార్గమును పరిమితం చేస్తున్నది.  దీని ఫలితంగా జెర్డన్స్ కోర్సర్‌లు ఇష్టపడే పొదల సాంద్రత మించి ఏర్పడుతుంది.



### 1. ప్రాజెక్టు శీర్షిక

భారతదేశంలో దక్షిణ ఆంధ్రప్రదేశ్‌లో జెర్డన్స్ కోర్సర్ మరియు దాని యొక్క మనుగడకు కలిగే తీవ్రమైన అపాయకర పరిస్థితిని ఉనికిని గూర్చి సర్వే.

### 2. ప్రధాన పరిశోధకులు.

అసాద్ ఆర్. రహ్మాన్ (డైరెక్టర్, బాంబే నేచురల్ హిస్టరీ సొసైటీ, ముంబాయి, బిఎన్‌హెచ్‌ఎస్).
పి. జగన్నాథం (జంతుజీవ శాస్త్రవేత్త, నేచర్ కన్జర్వేషన్ ఫౌండేషన్, మైసూరు, ఎన్‌సిటి).

### 3. గత చరిత్ర మరియు సమర్దన.

జెర్డాన్ కోర్సర్ రైనాప్టిలస్ బైటర్క్వేటస్ ఒక తీవ్ర ఆపాయం కల్గించబడినట్లు ఐయుసిఎన్ (ఐయుసిఎన్) 2013) చేత వర్గీకరించబడినది. ఇది ఇండియన్ వైల్డ్ లైఫ్ ప్రొటెక్షన్ యాక్టు , 1972 క్రింద షెడ్యూల్ 1 గా పట్టిక చేయబడినది మరియు నేషనల్ వైల్డ్‌లైఫ్ యాక్షన్ ప్లాన్ (2002-2016) క్రింద ఒక ముందు ప్రాధాన్యత రకం గా పరిగణించబడినది. ఇది ప్రభుత్వ చేపట్టిన వైల్డ్ లైఫ్ హాబిటెట్ 11 వ పంచవర్ష ప్రణాళికలో సమీకృత అభివృద్ధి లోని 12 రకాలలో ఒకటిగా గుర్తించబడినది. అయినప్పటికి జనాభా తెలియనప్పటికి 2001లో, అంతర్జాతీయంగా పక్షుల జనాభాను దగ్గించవేయుట చేత ఇది చాలా తక్కువ ఉంటుందని నమ్మడమైది. జెర్డన్ కోర్సర్ దట్టమైన అడవులలో మృదువైన గులకరాళ్ళ తొలగించివేసిన భూమిలోనికి తెరిచివున్న తొర్రలలో నివశిస్తాయి. గత అధ్యాయనముల ప్రకారము ఈ రకం ఎక్కడైతే దట్టమైన పొదలు గల అడవి ఉంటుందో ( 2 మీటర్ల కంటే ఎక్కువ ఎత్తు ) మరియు 300-700 ఒక హెచ్ ఎ కు గల ప్రదేశంలో చాలా వరకు సంభవించును అని తెలుపబడినది. మరియు తక్కువ సాంద్రత గల పొదలు అనగా 2 మీటర్ల కంటే తక్కువ అనగా 1,000 ఒక హెచ్ ఎ కు ఉంటున్నట్లుగా (జగన్నాథన్, 2004) ఉంటుంది.

ఎప్పుడైతే 1986లో ఈ జెర్డన్స్ కోర్సర్ తిరిగి ఆవిష్కరించబడినప్పటి నుండి నిర్ధారణ చేయబడిన రికార్డులు కొన్ని స్థలముల నుండి మాత్రమే తీసుకోబడినవి మరియు ఆంధ్రప్రదేశ్, కడప జిల్లా లోని శ్రీ లంకమనేశ్వర అభయారణ్యము పరిసర ప్రాంతముల నుండి మాత్రమే నిర్ధారణ చేయబడినది. ఈ తిరిగి ఆవిష్కరణ జరిగిన వెంటనే ముఖ్యంగా దక్షిణ భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌లో గల జిల్లాలు అనగా కడప, నెల్లూరు, చిత్తూరు మరియు అనంతపురం జిల్లాలలో (భూషన్, 1994 చేత) ఒక త్వరిత క్వచ్చనేర్ సర్వే నిర్వహించబడినది. ఈ సర్వే కాలములో జెర్డన్స్ కోర్సర్ నిర్ధారణ నివేదికలను ఆరు ప్రదేశముల నుండి తీసుకోబడినది మరియు ఈ మొత్తం ఆరు స్థలములలో రెండింటిలో ఈ పక్షి కనిపించినది. ఈ కనిపించిన నివేదికలు కడప ప్రదేశం నుండి మాత్రమే కాదు. జెర్డన్స్ కోర్సర్ నిర్ధారణ చేయబడని నివేదికలు పద్నాలుగు ప్రదేశముల నుండి ఉన్నాయి. ఇది గమనించబడిన స్థలముల నుండి మినహా మిగతా ప్రదేశములు మరియు ఇతర నిర్ధారణ చేయబడిన, చేయబడని ప్రదేశముల నుండి రిపోర్టులను స్థానిక షెడ్యూల్ తెగల ప్రజల నుండి లేదా పక్షివేటగాళ్ళ నుండి తీసుకోవడం జరిగింది.

తీవ్రమైనపరిస్థితి అపాయములో ఉన్న జెర్డన్స్ కోర్సర్ భౌగోళిక సామర్థ్య పంపిణీకు అనుకూలంగా ఉండునట్లు తెలుసుకొనుట చాలా ముఖ్యం ఎందుకనగా ఈ జాతి యొక్క మనుగడ చాలాత్వరితగతిన తగ్గిపోతుంది (సేనాపతి ఇటి, 2007). క్షీణించుట మరియు, పొదలు గల అడవులు తరగిపోవుట అంటే అర్థం తీవ్రమైన పరిస్థితిలో వున్న జెర్డన్స్ కోర్సర్ సామర్థ్య పంపిణీలో తగ్గింపు అని అర్థము. అయినప్పటికి, ఒక ప్రధాన పరిశోధకుడు మరియు అతని బృందంతో కలిసి దశాబ్దం వరకు ఒక రాత్రివేళ మేల్కొని వుండే మరియు ఒక ప్రత్యేక పక్షి గూర్చి చేసిన అధ్యాయనములో సదరు పక్షి మనుగడకు గల అవసర ముల పై ఒక ఆధారిత సమాచారమును వచ్చినది , ఇంతకు ముందు ఎప్పుడు తెలియని అరుపును గుర్తించి జగన్నాథన్‌చే, 2006లో రికార్డు చేయబడినది మరియు ఒక ప్రామాణిక సర్వే టెక్నిక్‌ను అభివృద్ధి చే సి ఒక ప్రత్యేక స్థలంలో శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము, కడప జిల్లా నుండి ఒక తెలిసిన జాతి సమూహ ము పైన ఈ అన్నింటిని నిర్వహించడమైనవి. ఇంత వరకు దీనికి బయట ఎలాంటి ప్రత్యేకించబడిన అధ్యాయనము నిర్వహించబడలేదు. ప్రత్యేకంగా ఇది పరిమాణము, హోదా మరియు పొదలు కలిగివున్న అడవి నివాస పంపిణి కలిగివున్నట్లు తెలిసినది. ఈ అధ్యాయనము తీవ్రమైన అపాయమునకు గురైన జెర్డన్స్ కోర్సర్ ఉనికిని కనుగొనుటకు ప్రయత్నం చేయుటతో సహా ఇందులో వున్న లోపమును నెరవేర్చును.





## 4. ప్రతిపాదించబడిన ప్రాజెక్టు యొక్క అధ్యాయన ప్రాంతము.

ఈ ప్రస్తుత ప్రాజెక్టులో చరిత్రాత్మక జెర్డన్స్ కోర్సర్ యొక్క స్థాయి నివాసమునకు అనుకూలమైన ఏర్పాట్లను చేయుటకు ఉద్దేశించబడినది, ఇవి ముఖ్యంగా దక్షిణ ఆంధ్రప్రదేశ్‌లోని కడప, నెల్లూరు, కర్నూలు, చిత్తూరు మరియు అనంతపురం జిల్లాలలో ఉన్నాయి. ఒక ప్రాథమిక భూమి వినియోగం, ల్యాండ్ కవర్ మ్యాప్ అందించ బడుతుంది మరియు ఫీల్డ్ సర్వే ఆధారముగా ఈ ప్రాంతములో నిర్వహించబడుతుంది అది ముఖ్యంగా పొదలు కలిగివున్న అడవి ప్రాంతములో నిర్వహించబడును. లభ్యత మరియు పొదులు కలిగివున్న అడవి విస్తీర్ణం మరియు చారిత్రాత్మక జెర్డన్స్ కోర్సర్ యొక్క సంభావ్యత ల పై ఆధారముగా ఒక ఇంటెన్సివ్ కెమెరా సర్వే నిర్వహించబడుతుంది. వెజిటేషన్ శ్యాంపిలింగ్ మరియు నివాస పర్యవేక్షించుట ఈ చరిత్రాత్మక స్థలములలో మరియు శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము దగ్గర ప్రదేశంలో ఎక్కడైతే జెర్డన్స్ కోర్సర్ యొక్క ఉనికి ఉంటుంది అనుకొన్న ప్రదేశంలో నిర్వహించబడును.

## 5. ప్రతిపాదించబడిన అధ్యాయనము యొక్క లక్ష్యాలు :

ఈ అధ్యాయము యొక్క ప్రధాన లక్ష్యములు ఈ క్రింది విధంగా ఉన్నాయి.

- దక్షిణ ఆంధ్రప్రదేశ్ లోని కడప జిల్లాలోనే కాకుండా ఇతర ప్రాంతములో చరిత్రాత్మక స్థాయి కలిగివున్న జెర్డన్స్ కోర్సర్ యొక్క నివాస సామర్థ్యంనకు అనుకూలంగా ఉండే పొదలు కలిగివున్న అడవిని మ్యాప్ చేసి మరియు గుర్తించుట.
- ప్రస్తుతం జెర్డన్స్ కోర్సర్ యొక్క నివాస స్థాయి సామర్థ్యం బయట అనుకూలత సామర్థ్యంను సర్వే చేసి మరియు సంభవించగల జాతులను నిర్ణయించుట.
- ప్రస్తుతం వున్న నివాసంలో మార్పులను మరియు చారిత్రాత్మక జాతుల స్థాయిని పర్యవేక్షించుట.

## 6. పరిశోధన విధానము

**లక్ష్యం 1:** దక్షిణ ఆంధ్రప్రదేశ్ లోని కడప జిల్లాలోనే కాకుండా ఇతర ప్రాంతములో చరిత్రాత్మక స్థాయి కలిగివున్న జెర్డన్స్ కోర్సర్ యొక్క నివాస సామర్థ్యంనకు అనుకూలంగా ఉండే పొదలు కలిగివున్న అడవిని మ్యాప్ చేసి మరియు గుర్తించుట.

చారిత్రక స్థాయి గల ప్రాంతములోపల జెర్డన్స్ కోర్సర్‌కు అనుకూలంగా సాంద్రత పొదలు కలిగివున్న నివాస విస్తీర్ణం మరియు పంపిణి భూములను వినియోగించి దక్షిణ ఆంధ్రప్రదేశ్‌లోగల చిత్తూరు, అనంతపూర్, కడప, నెల్లూరు మరియు కర్నూలు జిల్లాలలో వున్న 5 ఉపగ్రహ చాయాచిత్రములను వినియోగించి మ్యాపింగ్ చేయవలెను. ఈ జిల్లాలలో మాత్రమే జెర్డన్స్ కోర్సర్ చారిత్రక ఉంటున్నదని తెలిసినది (భూషన్ 1994). కడప జిల్లాలోని ఉపగ్రహ చాయాచిత్రముల యొక్క ప్రాథమిక విశ్లేషణ వలన సదరు ప్రాంతములలో సర్కారు తుమ్మ చాలా విస్తారంగా పొదలు కలిగివున్న అడవి నివాసము వర్గీకరించబడినది (జగన్నాథన్ 1996).

వివిధ నెలలలో ప్రాంత అధ్యాయనముల (మెట్ట, తడి మరియు రుతు చాయాచిత్రముల) యొక్క ఉపగ్రహ చాయాచిత్రాలను దృఢపరచుకొనుటకు సేకరించబడును మరియు వివిధ రకాల నివాసముల నుండి నేల యొక్క ట్రూతింగ్ పాయింట్ అత్యధికంగా ఉన్నటువంటివి సేకరించబడును. ఈ సమాచారము వివిధ రకాల ఇమేజి రేషనింగ్‌లను మరియు వర్గీకరణ టెక్నిక్‌లు ( అనగా మల్టిస్పెక్ట్రల్ మరియు మల్టి టెంపోరల్‌తో సహా) అధ్యాయన ప్రాంతములో పరీక్షించుటకు గాను ఉపయోగించబడును. ఏర్పడిన మ్యాపులు, జెర్డన్స్ కోర్సర్ యొక్క మనుగడకు అనుకూలమైన నివాసముల పంపిణీ గుర్తించబడుతుంది, మరియు భవిష్యత్తు సర్వేలకు వినియోగించబడుతుంది. భౌగోళిక సమాచార వ్యవస్థ ద్వారా ఎన్నో రకాల భూమి యొక్క థర్మాటిక్ పొరలు అనగా రాష్ట్ర, జిల్లా అభయారణ్యం మరియు రక్షిత ప్రాంతములు నివాస సానుకూలత తో విశ్లేషించబడి పొదలు కలిగివున్న అడవుల సంరక్షణ హోదా మ్యాప్ ద్వారా గుర్తించబడుతుంది.

**లక్ష్యం 2 :** ప్రస్తుతం జెర్డన్స్ కోర్సర్ యొక్క నివాస స్థాయి సామర్థ్యం బయట అనుకూలత సామర్థ్యంను, సర్వే చేసి మరియు సంభవించగల జాతులను నిర్ణయించుట.

జెర్డన్స్ కోర్సర్ యొక్క భౌగోళిక పంపిణి చాలా తక్కువగా ఉన్నట్లు తెలిసినది. చాలా వరకు జెర్డన్స్ కోర్సర్ కనిపించిన రికార్డులు పొదలు కలిగివున్న అడవి నివాసము నుండి ఉన్నాయి. అయినప్పటికి దక్షిణ ఆంధ్రప్రదేశ్‌లో పొదలు కలిగివున్న అడవి పంపిణి మరియు విస్తీర్ణం పై సమాచారము లేదు. ఈ అధ్యాయనము ప్రధానంగా జెర్డన్స్ కోర్సర్ పంపిణితో సహా సానుకూలమైన ప్రాంతముల గుర్తించుట జరుగుతుంది. ఒక వేళ కనిపించిన సానుకూలత నిర్ధారణ అయినపుడు (లక్ష్యం 1 చూడండి) ప్రమాణిక సర్వే టెక్నిక్‌లను అనగా ఆటోమేటిక్ కెమెరా ట్రాప్‌లు, సాయంత్ర వేళల్లో అరువులను వినుట వాటిని వినియోగించుకొని జాతులను అంచనా వేయబడును. (జగన్నాథన్ 2006).

**లక్ష్యం 3 :** ప్రస్తుతం వున్న నివాసంలో మార్పులను మరియు చారిత్రాత్మక జాతుల స్థాయిని పర్యవేక్షించుట.

స్థానికంగా తగు విధమైన జెర్డన్స్ కోర్సర్‌కు అనుకూలమైన లక్షణములు కలిగివున్న పొదలు కలిగివున్న అడవుల విస్తీర్ణం మ్యాప్ చేయబడుతుంది మరియు రిమోటు సెన్సింగ్‌ను ఉపయోగించి చారిత్రక స్థలముల పరిసర ప్రాంతముల వద్ద లెక్కించబడును మరియు గ్రౌండ్ సర్వేలు లక్ష్యం 1 వివరించిన విధంగా నిర్వహించబడును. వెజిటేషన్ ప్లాట్లు పొదలు కలిగివున్న అడవి నివాసము యొక్క పరిస్థితుల విస్తీర్ణం పై ఆధారముగా అక్కడక్కడ ఏర్పాటుచేయబడును. పొదల యొక్క సాంద్రత మరియు ఎత్తు మరియు గ్రౌండ్ వెజిటేషన్ నిర్మాణము మరియు స్వభావముతో సహా 10/10 మీటర్ల ప్లాట్లుగా రికార్డు చేయబడతాయి.

శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము కడప జిల్లాలో జెర్డన్స్ కోర్సర్ ఉన్నదని తెలిసిన ప్రాంతములో చాలా వరకు శాశ్వత ప్లాట్లను స్థాపించడం జరిగింది. జగన్నాథన్ ఇటి 2004). ఈ ప్లాట్లు వద్ద నివాసము లో ఏవైనా మార్పులు ఏర్పడినది లేనిది తెలుసుకొనుటకు క్రమమైన విరామ కాలములలో సర్వే చేయబడి మరియు పర్యవేక్షించబడును.

## 7. ప్రాజెక్టు అమలుచేయు ఏజెన్సీలు మరియు వాటి బాధ్యతలు :

బాంబే నేషనల్ హిస్ట్రి సొసైటీ (బిఎన్‌హెచ్ఎస్) మరియు నేచర్ కన్సర్వేషన్ ఫౌండేషన్ (ఎన్‌సిఎఫ్ ) రెండు కలిసి ఉమ్మడిగా ఈ ప్రాజెక్టును అమలుచేస్తాయి. వారు ఫీల్డ్ వర్క్‌ను నిర్వహించుటకు గాను ఫీల్డ్ పరిశోధకులను నియమించుతారు. వారు ఈ ప్రాజెక్టులోని అమలుచేయు భాగమును మరియు పరిపాలనను పర్యవేక్షిస్తారు. ప్రధాన పరిశోధకుడు (ప్రిన్సిపల్ ఇన్వెస్టిగేటర్స్ (పిఐ)లు అధ్యాయన విధానము నిర్ణయించి మరియు పరిశోధకులకు కావలసిన విజ్ఞాన సమాచారములు అందిస్తారు. ఈ పిఐలలో ఒకరైన (పి.జగన్నాథన్) ఫీల్డ్ కో ఆర్టినేటర్ గా వ్యవహరించును మరియు ప్రాజెక్టు లోని ఫీల్డ్ వర్క్‌ను పర్యవేక్షించును. ఈ పిఐలు ఆంధ్రప్రదేశ్ ఫారెస్ట్ డిపార్టుమెంట్‌కు (ఎపిఎఫ్‌డి) ప్రతి 6 నెలలకు ఒక సారి నిర్వహించబడుతున్న కార్యకలాపాల గురించి మరియు ప్రాజెక్టు ఫలితములను రిపోర్టు చేస్తారు.

### ప్రాజెక్టు యొక్క ఇతర ముఖ్యమైన వ్యక్తులు /సంస్థలు :

రాయల్ సొసైటీ ఫర్ ద ప్రొటెక్షన్ ఆఫ్ బర్డ్స్ (ఆర్ఎస్‌పిబి) యు.కె. 2000 సంవత్సరము నుండి ఈ జెర్డన్స్ కోర్సర్ సంరక్షణలో పాటుపడినది. ఆర్ఎస్‌పిబి యొక్క పరిశోధన జీవశాస్త్రవేత్త డా ॥ రైస్ గ్రీన్ జెర్డన్స్ కోర్సర్ పైన వివిధ అంశములపై శాస్త్రీయ పరిశోధన జరిపిన ప్రముఖ కాంట్రిబ్యూటర్. అతడు ప్రాజెక్టు యొక్క ప్రధాన శాస్త్రీయ సలహాదారుగా వ్యవహరిస్తారు.

జాతీయ మరియు అంతర్జాతీయ జర్నల్స్‌లో ఫలితాలను ప్రచురించు బాధ్యత ఈ సంస్థ యొక్క బృందానిది.





### 8. వ్యక్తులు మరియు సంస్థల యొక్క అనుభవమునకు సంబందించిన క్లుప్త వివరణ.

ద బాంబె నేచురల్ హిస్ట్రి సొసైటీ (బిఎన్‌హెచ్‌ఎస్) 1883లో స్థాపించబడినది మరియు గత 123 సంవత్సరాలుగా ప్రకృతిని కాపాడుతూ వస్తున్నది. భారత ఉపఖండములో ఈ బిఎన్‌హెచ్‌ఎస్ ఒక అత్యంత పురాతన ప్రభుత్వేతర (ఎన్‌జిఓ) ప్రకృతి సంరక్షణలో పాలుపంచుకొంటున్న సంస్థ ఇది. బిఎన్‌హెచ్‌ఎస్ సంస్థ యొక్క శాస్త్రవేత్తలు భారతదేశవ్యాప్తంగా పక్షుల పై పరిశోధన మరియు సంరక్షణ పాల్గొంటున్నారు.

ద నేచర్ కన్సర్వేషన్ ఫౌండేషన్ (ఎన్‌సిఎఫ్) భారతదేశంలోని వైల్డ్‌లైఫ్ మరియు సహజ జీవావరణ వ్యవస్థల పరిరక్షణ సాంఘీక బాధ్యత మరియు శాస్త్రీయత పై నిబద్ధతతో ఉన్నది. ఎన్‌సి ఎఫ్ 1996 లో స్థాపించబడిన లాభార్జన లేని సంస్థ. ఎన్‌సి ఎఫ్‌లో వైల్డ్‌లైఫ్ నివాసము స్థాయిలలో కోరల్ రీఫ్‌ల నుండి హిమాలయాలలోని ఎత్తైన శిఖరాలు అనగా ట్రాపికల్ ఎండతీవ్రత కలిగివుండు వర్షదార అడవులలో అత్యంత విద్యార్హతలు కలిగివున్న మరియు ప్రేరణ కలిగివున్న పరిరక్షణ శాస్త్రవేత్తలు పనిచేస్తున్నారు.

### 9. డబ్బు వెచ్చించు విధాన వివరణ:

డబ్బు ప్రధానంగా ఫీల్డ్ వర్క్ చేయు కార్యక్రమాలపై వెచ్చించబడుతుంది మరియు ఫీల్డ్ వర్క్ లో పనిచేయు ఫుల్‌టైమ్ ఉద్యోగులకు జీతభత్యములకు చెల్లించబడును. ఈ డబ్బులో కొంత భాగము పరికరాలను అనగా ప్రత్యేకించి కెమెరా ట్రాప్‌లు మరియు ఫీల్డ్ వర్క్ నిర్వహించుటకు వాహనములను సేకరించుటకు గాను ఖర్చుచేయబడుతుంది. మొత్తం ప్రాజెక్టు ఖర్చులో ఇరవై శాతమును (బి ఎన్‌హెచ్‌ఎస్ మరియు ఎన్‌సిఎఫ్) సంస్థ యొక్క ప్రధాన పరిపాలనకు జరుగుతుంది.

### 10. ప్రణాళిక చేయబడిన కార్యక్రమాలు :

ఫీల్డ్ వర్క్‌ను రెండు బృందములు నిర్వహిస్తాయి. ఒక బృందములో ఒక పరిశోధకుడు మరియు ఇద్దరు సహాయకులు వుండి శ్రీ లంకమలేశ్వర అభయారణ్యము (ఎస్‌ఎల్‌డబ్లుఎల్‌ఎస్) నందు కెమెరా ట్రాపింగ్ మరియు ఇతర ఫీల్డ్ పరిశోధన నిర్వహిస్తాయి. వేరొక బృందంలో ఒక పరిశోధకుడు మరియు ఇద్దరు సహాయకులు కలిగివుండి దక్షిణ ఆంధ్రప్రదేశ్‌లో ఎస్ ఎల్ డబ్లు ఎల్‌ఎస్ బయట జోర్డన్స్ కోర్సర్‌కు మనుగడకు అనుకూలమైన సామర్థ్యము గల నివాసములను కెమెరా ట్రాపింగ్‌లు నిర్వహించు కార్యక్రమం చేపడుతారు.

### 11. సూచనలు :


భూషన్, బి (1986). జెర్డన్స్ లేదా డబుల్ బ్యాండెడ్ కోర్సర్ కర్సోరియస్ బిటర్క్వేటస్ (బ్లైట్). జర్నల్ ఆఫ్ బాంబె నేచురల్ హిస్ట్రి సొసైటీ . 83.1.14

భూషన్ బి (1994). ఓర్నిథాలజీ ఆఫ్ ద ఈస్టర్న్ ఘాట్స్, పిహెచ్‌డి సిద్దాంతము, బాంబె యూనివర్సిటి, బాంబే.

బర్డ్ లైఫ్ ఇంటర్నేషనల్ (2001). త్రెటెన్డ్ బర్డ్స్ ఆఫ్ ఆసియా, ద బర్డ్‌లైఫ్ ఇంటర్నేషన ల్ రెడ్ డేటా బుక్, కేంబ్రిడ్జ్, యు కె : బర్డ్ లైఫ్ ఇంటర్నేషనల్

భారత ప్రభుత్వం (2002). ద నేషనల్ వైల్డ్‌లైఫ్ యాక్షన్ ప్లాన్ (2002-2016) పర్యావరణం మరియు అడవులశాఖ , పేజి 1-46.

ఐయుసిఎన్ (2013) ఇంటర్నెట్, 10వ జనవరి, 2013

జగన్నాథన్ పి., గ్రీన్ ఆర్.ఇ., నోరిస్ కె, వోజిఎట్జకిన్ , ఐఎన్, బార్ట్లజ్, ఎ, వోట్టన్ ఎస్‌ఆర్, బౌడెన్ సిజిఆర్, గ్రిఫిత్స్ జి. హెచ్, ఫ్లైన్ డి, మరియు రహ్మాని ఎఆర్, (2004) నివాస ఎంపిక మోడలింగ్ మరియు పొదలు కలిగివున్న అడవులలో ఉండే తీవ్రమైన అపాయం కలిగివున్న జోర్డన్స్ కోర్సర్ రినోప్టిలస్ బైటర్క్వేటస్, ఒక కొత్త విధానములో ట్రాకింగ్ అప్లైడ్ ఈకాలజి జర్నల్, 41.224.237.

జగన్నాథన్ పి. (2006). ఈకాలజీ ఆఫ్ ద జోర్డన్స్ కోర్సర్ రినోప్టిలస్ బైటర్క్వేటస్ ఇన్ ఇండియా, ముంబాయిలోని ముంబాయి యూనివర్సిటిలో సమర్పించబడిన పిహెచ్‌డి సిద్దాంతము.

సేనాపతి డి, వోజి ఎట్జకిస్ ఐఎన్, జగన్నాథన్ పి, గిల్ ఆర్‌ఇ, బౌడెన్ సిజిఆర్, రహ్మాని ఎఆర్, ఫైన్‌డి, మరియు నోరిస్‌కె (2007) యూజ్ ఆఫ్ రిమోట్ సెన్సింగ్ టు మెజర్ చేంజి ఇన్ ద ఎక్స్టెంట్ ఆఫ్ హాబిటెట్ ఫర్ ద క్రిటికల్లి ఇన్‌డేంజర్డ్ జెర్డన్స్ కోర్సర్ రినోప్టిలస్ బైటర్క్వేటస్ ఇన్ ఇండియా, బి ఐ ఎస్ , 149.328-337).



**ప్రాజెక్టు శీర్షిక : తీవ్రమైన అపాయము వున్న జెర్డన్స్ కోర్సర్ స్థాయిని సర్వే మరియు దక్షిణ ఆంధ్రప్రదేశ్, భారతదేశంలో దాని యొక్క నివాస మనుగడ.**

**భాగస్వాములు : ఎపి ఎఫ్ డి , బి ఎన్ హెచ్ ఎస్, ఎన్ సి ఎఫ్**

| క్యాటగిరి | వర్ణణ | ధర | 1వ సం॥ | 2వ సం॥ | 3వ సం॥ | మొత్తం | |
|---|---|---|---|---|---|---|---|
| **వృత్తిపరమైన సేవలు** | | | | | | | మొత్తం వృత్తిసేవలు |
| పూర్తి సమయ ఉద్యోగులు 1 | ప్రాజెక్టు కో ఆర్డినేటర్ | 50000 | 600000 | 600000 | 600000 | 1800000 | |
| పూర్తి సమయ ఉద్యోగులు 2 | ఇద్దరు ఫీల్డ్ పరిశోధకుల జీతభత్యములు ఒకొక్కరికి రు. 25,000/- చొప్పున ఐఎన్ఆర్ / నెలకు/ 1 సంవత్సరమునకు | 50000 | 600000 | 600000 | 600000 | 1800000 | |
| పూర్తి సమయ ఉద్యోగులు 3 | ఫీల్డ్ సహాయకులకు నలుగురికి రు. 7000/-చొప్పున ఐఎన్ఆర్ /నెలకు / ఒక వ్యక్తికి / 1 సం॥నకు | 28000 | 336000 | 336000 | 336000 | 1008000 | **4608000** |
| **ఫీల్డ్ ఖర్చులు** | | | | | | | మొత్తం ఫీల్డ్ ఖర్చులు |
| వాహన కొనుగోలు | ఫీల్డ్ వర్క్ ఒక వాహనమునకు ఒక రోజుకు | 850000 | 850000 | 0 | 0 | 850000 | |
| వేహికిల్ హైరింగ్ చార్జీలు | 750/- ఐఎన్ఆర్ / 20 రోజులకు/ నెలకు / 1సం॥నకు | 15000 | 180000 | 180000 | 180000 | 540000 | |
| ఇంధన ఖర్చులు | 200 కి.మీ/ రోజుకు75 ఐఎన్ఆర్ చొప్పున/1 సం॥నకు రెండు వాహనములు | 30000 | 360000 | 360000 | 360000 | 1080000 | |
| లాడ్జింగ్, అద్దె మరియు సందర్భానుసార ఖర్చులు | 5000 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు | 5000 | 60000 | 60000 | 60000 | 180000 | |
| ప్రయాణ మరియు స్థానిక రవాణా | 4000 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు | 4000 | 48000 | 48000 | 48000 | 144000 | |
| వాహన నిర్వహణ | 4000 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు /2 వాహనములు | 4000 | 48000 | 48000 | 48000 | 144000 | **2938000** |
| **కార్యాలయ ఖర్చులు** | | | | | | | మొత్తం కార్యాలయ ఖర్చులు |
| ఎలక్ట్రిసిటి / కమ్యూనికేషన్ ఖర్చులు | 3000 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు | 3000 | 36000 | 36000 | 36000 | 108000 | |
| పోస్టేజి / కార్యాలయ మెటీరియల్ | 1000 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు | 1000 | 12000 | 12000 | 12000 | 36000 | |
| స్టేషనరీలు | 500 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు | 500 | 6000 | 6000 | 6000 | 18000 | |
| ఎక్స్టర్నల్ హార్డ్ డిస్క్ | 2 నెంబర్లు / 7000 ఐఎన్ఆర్ | 14000 | 0 | 0 | 0 | 14000 | **176000** |
| **పరికరములు** | | | | | | | మొత్తం పరికరములు ఖర్చులు |
| జి పి ఎస్ | 2 నెంబర్లు / 25000 ఐఎన్ఆర్ / ఒక్కటికి | 50000 | 0 | 0 | 0 | 50000 | |
| రికోనిక్ కెమెరాలు | 100 నెంబర్లు / 24000 ఐఎన్ఆర్ / ఒక్కటికి | 2400000 | 0 | 0 | 0 | 2400000 | |
| లాప్‌టాప్ మరియు డెస్క్‌టాప్ | 3 నెంబర్లు / 30000 ఐఎన్ఆర్ / ఒక్కటికి | 90000 | 0 | 0 | 0 | 90000 | |
| ప్రింటర్ | 1 నెంబర్లు / 30000 ఐఎన్ఆర్ / ఒక్కటికి | 30000 | 0 | 0 | 0 | 30000 | |
| టార్చిలైట్ / హెడ్‌ల్యాంప్‌లు | 5 నెంబర్లు / 3000 ఐఎన్ఆర్ / ఒక్కటికి | 15000 | 0 | 0 | 0 | 15000 | **2585000** |
| **వర్క్‌షాపులు, సమావేశములు, ప్రచురణములు** | | | | | | | వర్క్‌షాపులు, సమావేశములు, ప్రచురణములు ఖర్చులు |
| వర్క్‌షాపు&శిక్షణ కార్యక్రమములు | 2 వర్క్‌షాపులు | 40000 | 0 | 0 | 0 | 40000 | |
| నివేదికలు మరియు ప్రచురణములు | | 40000 | 0 | 0 | 0 | 40000 | |
| ఇతర ఖర్చులు | 2000 ఐఎన్ఆర్ / నెలకు/1 సం॥నకు | 2000 | 24000 | 24000 | 24000 | 72000 | **144000** |
| | 20% అదనపు ఖర్చులు (సంస్థలకు) | | | | | | |
| **మొత్తం ఖర్చులు** | | | | | | | **2106200** |

